# తృణకంకణము

రాయప్రోలు
సుబ్బారావు

△

నవ్య సాహిత్య పరిషత్తు
△ గుంటూరు △

అణువు నజాండము నేక స
రణి నిండారిన మనోహరపు వాగర్థ
ప్రణయము గీర్తించెదు మృదు
గుణులను భాషాకుమారకుల నుతియింతున్.

శాశ్వత నవ్యస్ఫురణ ల
నశ్వర లావణ్యమై పెనగ, గావ్యకళా
విశ్వమునం దానంద ర
సైశ్వర్యము తేలు కవిత కంజలి నిత్తున్.

శశి వికసించిన శ్రావణ
నిశీథమున గానబడిన నీరదసుతకున్
బ్రశమితమతినై యీ ప
ద్యశుభాంజలి నొసగితి ‘ప్రణయార్పణ’ మనుచున్.

## తృ ణ కం క ణ ము

అడుగులు బొబ్బ లెత్త, వదనాంచలమందుల జిన్కు చెమ్మటల్
మడుగులు గట్ట, మందుకసుమాలపు టెండ బడంతి యోర్తు జా
ఱెడుజిలుగుంబయంట సవరించుచు జొక్కినయింపుతోడ గా
ల్నడకన బోవుచుండె నెడలన్ గనుపట్టెడు తోటలోనికిన్.

పసినిమ్మపండు ఛాయల
గొనరెడి యా కుసుమగంధి కోమలపు టొడల్
కనుగందిన కవటా కన
వసివాడె నిదాఘతాప పరిపీడనచేన్.

కన్నె గేదంగి చెందునా గళుకు లోలయు
నావెలంది యొడల్ నగ లేవి లేక,
జాఱు చెమ్మట ముత్యాలజంపు సరుల
సహజ సౌందర్యమును వెద జల్లుచుండె.

పదియు నాల్గు వసంతముల్ వదలనట్టి
వయసు సొగసుందనం బామెమెయి నెసంగ,
బాల్య మెడలిన మొలుచు జవ్వనపునూగు
ఒడలియం దందముగ నుట్టిపడుచు నుండె.

నడచుదారి పురోపకంఠంబు నొఱసి
చనుచునుండె, నామెకు ముందు వెనుక నెవరు
వచ్చుచున్న జాడలును గన్పట్ట వయ్యె:
ఎచటి కేగునొ, కారణ మేమి యగునొ!

ఇసుక దిగబడు నడుగుల నీడ్చికొనుచు,
నుడుకుటెండకు మండునిట్టూర్పు లదర,
కాలి చల్లారు పెంపుడు కానబడిన
పడుచు జింకపడంతి నా నడుచు నామె.

ఎడనెడ గుఱింగటను మా
మిడి చెట్టులు గలవు, కాని మెలతుక తా నా
కడలను నిలువగ నేగదు
నడచుం దన నడకబడినె నలగి కలగియున్.

జిలుగుపూల కలంకారి చీర జాఱ,
జిందు సందెడు కుచ్చెళ్లు చెదరనీక,
మాటికిని కాలికడియాలు మలపుకొనుచు,
గూఁతవే టిటు చని దరిఁకొనియె వనము.

పడమట జాముప్రొద్దు కనుపట్టుచునుండె, నిదాఘశాంతి య
య్యెడు మలుసంజ చిన్నెల నొకింత ప్రసన్నము లయ్యె గాడుపుల్
నడకల జొక్కి సోలిన నెలంతయలంతలు పంచుకో బఱుం
గిడె నన నామె డాయ జనియెం దనపెంచిన లేడి యయ్యెడన్.

తనయందెల రవళిక గుఱు
తున డాసిన హరిణపుత్రి దోడ్తో ఁ గని చ
ల్లని చెమట లూరు హస్తం
బున దువ్వుచు నిట్లు కొంత ముచ్చట నడపెన్.

నయనమూలాంచలములు స్విన్నంబు లయిన
వేల? చెల్లెలా! యీ ప్రాలుమాలికలకు
గారణం బెయ్యది? కఠోర్వకంటకంపు
వనుల దిరుగవు గద చిన్నతనపుజేష్ట!

అని నగవుంబలుకుల గను
గొనలను వాత్సల్యరసము గురియగ, నా మో
హనహరిణంబును ముద్దిడి
కొనియెను దృణపరిమళము బుగుల్కొను మొగమున్.

నడచి బడలిన యాయాస మెడల లేదు,
చీరచెఱఁగుల తడియైన నాఱ లేదు,
లేడి నరసినయప్పుడె ముద్దాడికొనియె,
నహహా! యెంతటిప్రేమార్ద్ర మామెమనసు!

వాలుంగన్నుల సొగసుల
లాలింపుచు తన్ను జూచు లలితకురంగిన్
గే లిచ్చి పిలిచికొను చా
నీలాలక యొక్కపోకనీడకు జనియెన్.

క్రిక్కిఱియు కొమ్మ లాశల నెక్కి చలువ
లుట్టిపడు నీడపందిళ్ళు గట్టుచుండ,
గలదు చేరువ వృద్ధవృక్షం బొకండు;
సొన యొకటి పాఱు మొద లానుకొని సతంబు.

ఆ తరుచ్ఛాయ లోలసిన యంతవఱకు
స్నిగ్ధసికతాతలమ్ములు చెన్నుమీఱు,
నెండ కన్నెఱుగక, వానయేపు గనక
యలరు కలవారియింటి బిడ్డలవిధాన.

స్కంధకూలంకషమ్ముగా జాలువాఱు
పొడుపు సొనపయి బ్రాగభిముఖపు సరణి,
బూల రెమ్మల నింపు సొంపులు వహించు
శాఖ యొకడు వంతెనగాగ జాగిపోవు.

గెలలు దిగిన మవ్వపునారికేళతరులు,
పూలగుత్తులు వ్రేలాడు పొన్న చెట్లు,
మృదులరవముల బిలిచెడి వెదురుపొదలు,
కన్నెగందంపుమాకులున్ గలవు మఱియు.

సందె మసలినకొలది బ్రశాంత మగుచు
జలువయును మాంద్యమును దన్ను నలమికొనగ,
ద్రోవ సోలింపు లెడల బ్రదోషపవన
మల్ల నల్లన వీచె నా యబలమీద.

ముగ్ధ మధురమ్మయిన లేడి ముద్దులాట,
లోల పవనాకుల లతావలోకనంబు,
పొడుపుటేటిమెలపు, జారు ప్రొద్దు వలపు,
నాయమ నొకానొక వికార మందజేసె.

చేలచెఱంగునన్ మొగముచెమ్మట లొత్తు, చెయిం బెనంచు, నీ
లాలకము ల్మొగమ్ము గవియన్ బయి కడ్డము దిద్దు, మోవిపై
వ్రే లిడి యాలకించు, మురిపెంపు కనుంగవనిండ వాలికల్
దేలగ జూచు, నెద్దియొ మదిం దలపోయు ననేకరీతులన్.

చిటికెనవ్రేల మేలిమి పసిండిపసల్ మిసలాడ జూడ ము
చ్చట యగుముద్దుటుంగరమ్ము, చారుకుమారమృణాలకోమల
స్ఫుట మగుపాణిబంధమున బూన్చిన పచ్చనిపట్టుతోరమున్
గటకట వెట్టి యామె గడకంటి పసల్ బలవంత మీడ్చెడిన్.

వెలది చిన్నె లనుక్షణ భిన్నభిన్న
మృదువు లయి తోపగా సాగె, నింతలోన
సొమ్మసిల్లిన బిడ్డ నా సొగసి యామె
యడుగు లొరయుచు పవళించె హరిణపుత్రి.

తెలియరాని వికారంబు కలతబెట్ట,
నూర్పు విడుచుచు దాలిమి నోప లేక,
బెళుకు కాటుకకంటిచూపులు నిగిడ్చి
యెదియొ వినబడ్డయటు లైన నెద భ్రమించి.

చెంపకు జేరెడుకన్నుల
సొంపులు సుడియంగ నాకుసుమకోమలి కే
లింపుగ జెవిచెంగట నిడి
కంపితగతి వినియె నొక్కకంఠస్వరమున్.

రుచిర వేణునాళోదయ శ్రుతుల గలసి,
పాఱు చిఱుసొన బిలబిల ధ్వనుల నెనగి,
కడల వినవయ్యె నప్పు డాక్లాంతకంఠ
గద్గదస్వర మనుతాపకలన నిట్లు:—

"కాలమా! యూస నడియాస గాగ జేసి
వేసటల ద్రోసి యాయాసపెట్ట దలతె!
వృంత మెడ సేసి, తింక లితాంత మెంత
తడవు కృశియించి సొబగులు చెడకయుండు?

నా ప్రియసఖ! యనురూప గు
ణప్రచుర! ప్రసన్నశీల! నవనీత శిరీ
షప్రణయ మృదులహృదయ! క
టా! ప్రాణము లుండి యెటు విడంబడ సైతున్?

హృదయమా! యాసయే లేదు మొదల బూల
నభిలషించితి వొక్క మోహనసుమంబు;
చిరతరోత్కంఠ నెటులో సైచితివి; కాని
కాలము నిరాశ దార్చె నే గతి భరింతు!

భావభర మైన హృదయ దర్పణమునందు
రక్తి లిఖియించుకొంటి వేరమణిరూపు,
అదియె ముద మీక యలత కాస్పదమ యయ్యె,
గ్రహణగత మైన చంద్రునికళ విధాన.

క్రమ మని యక్రమం బని పరస్పరభిన్నమనోవికారసం
భ్రమముల గొన్నినాళ్లు వలవంతల స్రుక్కుచు దాళుకొంటి వా
కమలదళాక్షిపై మమత, గాలమె యాసల ద్రుంచివైచె, ప్రా
యమును గ్రసించు తాపవిష మక్కట! యెక్కడిచెల్మితీయముల్!

తేటవలపులు మొలక లెత్తినది మొదలు
నిలిపితి పవిత్రరాగ మా లలనయెడల,
దుదకు భగ్నమనోరథ తోషి వగుచు
నేటి కారాటపడ మరులెత్తి మనస!

వలపు నిండిన యకలుషభావమందు
నెద్ది కాంక్షించి తది లభియింప దయ్యె!
కడకు ననుతాప మొకడె నీయెడల నిలిచె,
నామె ప్రణయ స్మరణచిహ్న మగుచు నకట!

లలిత లావణ్య పూర్ణ మా లలన చెలువ
మెదుట గన్పట్టుచుండు నెల్లెడల నాకు,
గనులు మూసినన్ విప్పినన్ గలలె వచ్చు
బగలు రేలను భేద మేర్పడక యుండ.

నిదుర లేనట్టి రేలను నెలత! నీదు
ప్రణయ జాగరరక్తి నేత్రముల గాంతు,
నిదురపట్టిన రేల గాంచుదు సుఖంబు
స్వప్నపు టవస్థలను నీదుపజ్జ నబల!

హృదయ మోహన మయి ప్రేమమృదుల మైన
తావకీన లీలాదాన దళపుటంబు,
మామకీన ప్రణయభంగ మధుకణముల
విడిచెడు, విరక్తి బాష్పముల్ విడుచుపోల్కి.

చెలియా! యెన్నడొ చేరదీసె మనలం జిన్నారి నేస్తంబు, ము
గ్ధల మైయుంట నెఱుంగమైతి మపు డేఘోషన్ రవంతైన గం
దళితస్నిగ్ధరసోదయం బగుట జేతం బిప్పు డల్లాడి యా
కులు మేయున్,బలవద్వియోగములనుంగుం బ్రేమలన్ ద్రెంపగన్.

ఆశాభంగ కఠోరశస్త్రికలు కోయం గాయముల్ గాక, బా
ధాశోకంబున నేల యీకటికటల్ తాళంగ! నిర్వేదతృ
ష్ణాశోషం బడి, శూన్య మైన దురవస్థా లోకమం, దేవృథా
పాశంబుల్ బిగగట్టి నిన్ను త్యజియింపన్ లేవు నాప్రాణమా!

అకట! వంచించె విధి మోహామా! విఫల మ
నోరథుడు వీడు నీ వింక జేర నేల?
భావమా! వేపె దేల యీ ప్రణయ కృపణు?
శూన్య మగుచు నెందేని గాంచుము ప్రశాంతి.

ఎద గృశించెడి నీయరుంతుదవియోగ
దహన దందహ్యమాన మై, దైవమా! వి
కాసపతన మ్మగు ప్రపంచకమ్ము నందు
హేయ మగు కాయ మేల మోయించె దింక?

తన గుణలతలు పూచిన శోభలో యన
  జిఱునవ్వు వెన్నెల చెండ్లు విసర
దన మనోలీల గాంచిన రాగ మధువన
  బలుకు కొమ్మలు పూలపాలు పిదుక
దన భావబంధ మందిన విభ్రమం బన
  జూపులు వలపుటుచ్చులను పన్న
దన ప్రేమభావనల్ గను నూత్నకళ లన
  నడలు ప్రాయంపు మన్ననలు సూప
గనుల నఱవాల్చి పాతితాక్షముల తోడ
గాంచియును గాంచ లేని క్రీగంటికొనలు
పెడల వాలికల్ రాల నిల్చెడు త్వదీయ
మౌగ్ధ్య మెడబాయ లేదు నామది లతాంగి!"

అని స్వగత విలాపములన్
దనికెడి హృదయంబుతో నుదారకళా మో
హను డొక్క యౌవనుడు కం
చెను దాటుట జూడనయ్యె సీమంతినికిన్.

మిసమిసలాడు జవ్వనపుమేలిమి మేన ముసుంగు వాఱు గా
ని సొగసు సల్లినట్టి నలినిం దలపించెడు నెద్దియో రహో
వ్యసన నిపీడ కానబడు నాతని చూపులయందు, నార్ద్రలా
లసహృదయంబుమాత్ర మకలంకముగా గనుపట్టు మోమునన్.

అంత నాయిరువురును నన్యోన్యముఖ వి
లోకనంబులు నెయ్యముల్ కొనరికొనగ,
బదియడుగు లీవ లావల గదియ నడచి
చిటికలోపల గలసి రుత్కటభరార్తి.

కయికయి జేర్చి యొండొరు లొకానొకరీతిని మోదఖేద సం
శయముల నోలలాడుచు బ్రసన్నము లయ్యు నిమీలితమ్ములౌ
నయనము లెత్త లేక, వదనమ్ముల నేనియు జూచికోక, సై
చియు సయిపంగ జాలని స్పృశింపులు దోపగ నుండి రయ్యెడన్.

ఆజనన బద్ధబాంధవ మయిన చనువు,
చిరసమేళన కాంక్షావిచిత్ర రక్తి,
బలవ దాశావిభిన్న తాపంబు, నాప
డుచుజతను నేమి సేయు నట్టుల నొనర్చె.

ఆపగిది బెదవి కదపక,
చూపులు తమకంపు శోష సుడివడ, నిశ్చే
ష్టాపరవశులై కొండొక
సే పచ్చట నిలువబడిరి చిత్తరువు లనన్.

తుద కా తరుణుడు హస్తము
వదలుచు, నాపుణ్యవతి సొబంగుల మొగమున్
మృదు లేక్షణముల విలసన
మొదవింపుచు నెట్టకేని నుదితమధూక్తిన్.

"కుశలమే నెచ్చెలీ! యనుకూలపవన
మోహనంబులే యీదినమ్ములు? మనఃప్రి
యమె సమస్తం!" బటంచు, నెయ్యెదియొ పలికె
నంత కంఠకు గద్గద మైన రుతిని.

అశ్రుకణికామలీమస మయిన యతని
కౌతుకాకీర్ణ నేత్రయుగమ్ము నపుడు
తెఱచి యుండియు గనలేక తిప్పుట లొరసె
గలికి నవఘర్మకలుషితగండములను.

# తృ ణ కం క ణ ము

గళితవిలసన మగు మోము, నెలుగు రాలు
పడిన కంఠము, నిర్వేదభరము దోప
గట్టెదుట నన్ను మిత్త్రు నుత్కంఠ నరయ
దహతహంపడు చబల నేత్రముల నెత్తి -

తమి విదారించు నవచంద్ర ధవళరోచి
రుదయములు బోని చూపులు, మృదువు లయిన
తెప్ప జవనిక లొత్తికొం చప్పుడపుడు
ప్రియునిపై వెల్లివిరియ ద్రిప్పెను మొగంబు.

చిదికి చిదుకని వలపుల జెనకువగలు,
విడిచి విడువని మార్ధ్వంబు వడయు లజ్జ,
సమయభరమును, వ్యక్తి ప్రసన్నబుద్ధి,
యొండొరుల గడవంబడు చుండ నామె-

సోగకన్నులు వికసింప జూచి ప్రియుని,
పలుకుల హృదంతరార్థ మేర్పడగ ననియె,
నస్ఖలిత మగు ప్రేమరహస్యతత్త్వ
విశద బుద్ధిన్ హృదయవాద కుశల యగుచు.

సఖుల మనః ప్రియబంధము
లఖండము లటంచు విందు మకటా! యెటులన్
లిఖియింపక తాళితివి, న
ను ఖిన్నపడ జేయుట తగునో నీకు సఖా!

పాలును మీగడల్ మెదిపి వండినయన్నము లాఱకుండ, నే
వేళయు దప్పనీక తినిపించిన మోహపు దల్లి కామితం
బేల నిరాకరించితివి, యీసఖి, నాజననానురక్త, నే
లీల గృశింప జేసితి, చెలీ! యిటు లౌనె దయానువర్తనల్!

శైశవంబాది నిష్కలుషముగ బెరిగి
నా మనోలీన మైన ప్రాణంపు బ్రణయ
మింత తలపోయవైతి వాద్యంతములును,
ప్రేమతత్వం బెఱింగిన వృత్తి మిదియె?

విడుపు లెఱుగని కోర్కుల, నెడలు గనని
భావపరిచయముల, నింతవఱకు దనిసి
తనియని యభేదరాగబంధములు పెనచి
యేల త్రెంపంగ నిపుడు సుహృద్వ్రతంస!

అని యిటు లనుగుంగతి బై
కొన వగపులు పలికె గువ్వకుత్తుకతో నా
గుణవతి యాకర్ణవిలో
చనముల విశ్వాసబాష్పసలిలము నిండన్.

కలిపిన గాటపుంజెలిమి కాంక్షలు పెంచగ రేల్పవల్ తలం
పులను 'మమేకమైన'వలపుల్ కడకుం గడగండ్ల పాలుగా
గలిసిన జంటయందు, సఖికంఠ మటుల్ పెకలెన్ బ్రదోషదో
హల మయి తోడనే యతనియార్తవచోగతి తోచె నిట్టులన్:

నాయనుగుంజెలీ! చెలిమినాటినచిత్తమె యార్ద్ర, మందునా
శాయతరంజనం బయి ప్రియం బెనయించినయాదశల్ కడుం
దీయము లేమి చెప్ప! విడదీసిన రేకులపూవుచంద మై
పోయిన మైత్రి కేగతులు పో వలవంతలుదక్క నీభువిన్.

బాలా! యేటికి మాటలెత్తి నను నొవ్వంజేసె దింకన్, వృథా
లీలాభ్రాంతి యటం చెఱుంగక వ్యథాలీనుండ నై తిం దుదిన్
జాలున్ నెయ్యపుతీరుతియ్యములు, బాష్పజ్ఞాన విద్యార్థినై
కాలంబు న్వాయసున్ వ్రయించెదను సౌఖ్యం బొను నిశ్శాంతిమై.

సరసము లైన వావివరుసల్ గలువంగ, నభేదరాగముల్
తిరముగ బాదుకో బ్రణయలీనులమై, తుద కిట్లు దైవపుం
బరుసముచే నెడాట లలమన్, తెగద్రెంపులకత్తి కోర్చి యే
కఱకుటెడందతో గడపగాగల మీ విషకాలమున్ జెలీ!

వదలని కాంక్షమై మొలకవాఱిన నెయ్యము బెంచికొన్న, నీ
హృదయముకక్కసించునలయింపులుప్రాప్తములయ్యె బ్రేమముల్
సెదరిన శూన్యభావము లిసీ! రుచియింపవు రక్తిలేమి, నో
ముదిత! వియోగమందమృతమున్ విషమున్ సమవృత్తులేసుమీ!

పొరు పెఱుంగక యొకకంచమున భుజించి,
మనసు నాటిన మమతల ననగి పెనగి,
వలచుజతలను విడదీయ దలచు నేని
ప్రేమ నలయించు సృష్టి దైవికము కాదు !

ప్రియతమం బగు వస్తుసంప్రీణనమున
బ్రాణికిని హాయి కుదురు, నాపయి బ్రశాంతి
యొదవు, నుజ్జీవశూన్యమా బ్రదుకునకును
లేదు తన్మయోన్మీల నామోదసుఖము.

మృదువు లైన యస్మదుదార హృదయముల బ్ర
ణయ రసోదయ మనుచిత మయిన నగును,
శుక్తి ముత్యాలు పుట్టుట జోద్యమేని,
పద్మమున దేనె యూరుట పాపమేని!

కాయ మీడ్చెదునందాక, గాల మిచ్చు
భాగధేయము లనుభవింపకయ తీర
దబల! పంచుకొన్న విధినియామములను
ఖేదమో మోదమో యగు, లేదు వేఱు.

ఉదయలక్ష్మికి నఱుత నొప్పిదము నెఱపు
మంచి ముత్యాలదండ లౌ మంచుబొట్లు,
సాంధ్య కాంతావియోగ బాష్పములు గాగ
మాఱు టెఱుగవొ సృష్టిమర్మములఁ సరణి!

విగతకాలుష్య ముదిత మౌ జగతి విడిచి,
కాలగతిమెయి శోభ లెక్కడనో దాచి,
శారదశశాంకవిశదనిశాంతములను
మంచుకన్నీళ్ళు గార్చవే మబ్బు లబల!

మోహనవసంతునకు మోదమును ఘటించు
మసృణముగ్ధం బయిన మావిపసుపుటాకు,
హిమకుమారుడు రక్తి మాయింపు జేయ
డే సఖి! కాలచపలున కేది నియతి!

సరస సాంగత్య సుఖ వికాసములకన్న
దుస్సహ వియోగభరమె మధురమ్ము, సకియ
బాధ లేక వ్యసనరుచి బోధపడదు
చీకటులు లేక దీపిక చెలగ నట్లు.

ననుపు జాఱ జడీభావమున మునింగి,
పూలతోటలలో నున్న బూర్ణచంద్రి
చంద్రికలు కాయుచున్న, గాంక్షావిముక్త
హృదయము ప్రసన్నలలిత మై యెలమి గనదు.

కాంక్ష నశియింపని వియోగకాలమందు
సర్పమును గాంచి భ్రమియించు సఖుల పాలి
పూలదండ యటంచును, బూలదండ
గాంచి కాలపాశం బను గాంక్ష తెగిన.

విశ్వంబం దుదయించు ప్రాణి యొకటన్ బ్రేమించి లీలావిలా
సైశ్వర్యంబుల నందు, నంద కకటా! యర్థించు బ్రాణప్రబం
ధాశ్వాసాంతమునన్ దదశ్రుకణికావ్యాసంగమున్, బ్రేమపై
విశ్వాసంబున గాదె కోరు సుహృదాప్తిన్ జీవి విద్యావతీ!

నష్టమైనట్టి ప్రేమఖండముల కొక్క
సుకవి యక్షరజీవగీతికయ చాలు,
సకియ! విశ్వాసబాష్పముల్ చాలు నాకు,
లేదు వేఱాస ప్రణయవల్లీమతల్లి!

మఱువంబోకుము నెచ్చెలీ! ప్రణయరమ్యంబైన యానాళ్ళ, నే
మఱబోకించుక జీవితాంతమున ప్రేమన్ బ్రేమబాష్పాంజలిన్,
మఱువంబోకుము ముగ్ధరాగపరిణామజ్ఞానసిద్ధాంతమున్,
మఱువంబోకుమి యీకథన్ మఱచిపొమ్మా సర్వమున్ శాంతికై!

అని సాశ్రూక్తుల నిర్గతప్రణయమాహాత్మ్యంబు దోపంగ బ
ల్కినయా నేస్తపుకానియాననము వాల్ క్రీగన్నులం జూచి చూ
డని చందంబున జూచి, యిట్లనియె గూఢప్రేమలీలావినూ
తన విద్యాపరిపాటి తేటపడ, నాతన్వంగి శాంతశ్రుతిన్:

తగు నోయీ మిత్రుడ! నె
వ్వగలం దురపిల్ల, ప్రేమబంధము లకటా!
తెగ వోయీ తెగ ద్రెంపిన,
మిగులగ నిత్తురె మనంబు మిథ్యాభ్రమలన్!

దైవికం బగు సుకృతినిదక్క నవని
జతల ప్రేమోదయంబు సంగతము కాదు,
అందు నస్ఖలిత ప్రణయానురక్తి
చిరతపశ్శుద్ధిచే గాని దొరకబోదు.

బొంది నటించుప్రాణివలపుల్ సుడియించినవేళ, నింద్రియా
ళిం దనియింప భౌతికమలీమస మౌ, నటబడ్డ ధర్మపుం
బంధము లీడ్చి యీడ్చి యునపత్యముఖాదికమైన భూతర
క్తిం దగు లూని ప్రేమరుచికిన్ వెలియౌట లెఱుంగవో చెలీ!

విషయసుఖేచ్ఛలం దనియ విహ్వాలమైన హృదంతరమ్ము క
ల్మష మయి పోవ నీక యకలంక మృదూక్కృతసాధనన్ మనో
విషమగతిన్ మరల్చునెడ వివేకము, తన్మయమైనయార్ద్రమా
నుషదశయే కృతార్థము లనున్ కవివాణి యనుంగు నెచ్చెలీ!

చైత్రుతో వచ్చు పల్లవసంచయంబు
హిమవ దాగమమున నశియించునట్లు,
పడుచుదనముతో నుదయించు వలపు లెల్ల
గళు కెడలి కృశించును జరాక్రాంతదశల.

కడలితరగల నిలకడల్ గలవటోయి?
సంజకెంజాయరక్తి శాశ్వతమ యగునె?
భంగపరిణతి యొకట, దుర్భరత మో వి
కారము మఱొకటను, తప్పగలదె సఖుడ!

-వలపు మొగ్గలు దొడిగిన వయసుటనటి
యధిక మోహన మగుట సత్యంబె కాని,
యచిరశిథిలం బగుట నిర్ణయంబుసుమ్మి
కలదె నైమిత్తికముల కస్ఖలనవృత్తి?

కలిసినయంతమాత్రమున గాదుసుమీ! చెలికార, మంతరం
బుల నతుకంగజాలిన యపూర్వపులంకెయె స్నేహమౌ, తద
స్ఖలితసమస్తసాధనము జ్ఞానవిదగ్ధుల మార్గసూత్ర, మే
వలతినినైనఁ బ్రేమపరిపాకము లిట్టులె యన్వయించెడిన్.

పరమ ధర్మార్థ మయిన దాంపత్యభక్తి,
స్తన్యమోహన మయిన వాత్సల్యసక్తి,
సాక్షిమాత్రసుందర మైన సఖ్యరక్తి,
అందు నాదిమ మగు ప్రేమయంచె ముక్తి.

వలపుల పూలసంకెలలు బంధము లేయగ గువ్వజంట, ని
ర్మల మగువత్సలత్వ మెద రాగిల నావుల తల్లిబిడ్డ, లే
కలుషము లేని సత్ప్రణయకాంక్షలు మేళన జేయ మిత్రముల్
మెలగుదు రీరహస్యమె సుమీ ! కనిపించెడు సృష్టియందునన్ !

మనసుచే, వాక్కుచేత, కర్మంబుచేత
గలుషితములు కాదగిన పీవలపు లవని,
తపసుచే, తాల్మిచే, ధ్యానధారచేత
లీనమై యైక్య మంద జాలినది ప్రేమ.

శాంతియు బ్రేమయు న్మధురసంబులు పేశలరాగలాలిత
స్వాంతదళీపుటంబులను నయ్యవి యస్ఖలితంబు లై మనున్,
అంతరముల్ బెనంచిన ప్రియప్రణయంబులు మాయబోవు, వి
భ్రాంతియె గాక ప్రేమ గలుపన్ విడదీయ నిమిత్తసాధ్యమే.

కామము లేనిమేళన వికాసము నించు లతాసుమంబు లా
రామములందు నుండియు బరస్పరమున్ విడనాడ, వెట్టు లీ
ప్రేమతపఃఫలంబును లవింప దెగించితి విప్పుడే చెలీ !
యేమిటి కీచిరప్రణయవృంత నికృంతన పాపకర్మముల్ !

నిమ్మచెట్టు లేగొమ్మ పందిళ్ళక్రింద,
బుస్తకపు బేటికలను, నాహాస్తగదిత
చిత్రసూత్రమునందు వసించియున్న
దోయి ! యిందాక మన ప్రేమయును సఖుండ !

వీసఱపోని కాంక్ష వలపించి, మదిన్ మది జేర్చినట్టి సా
హసపుబున్నెముల్ బడయవచ్చునె స్వప్నమునందునేని మా
యా సముపేత మైన భ్రమ లారటబెట్టె నిటుల్ కుమారుతే
కోసిన ప్రేమగర్భమునకుం గతు లెయ్యవిపో సుహృన్మణీ !

వలపులె రహస్యములు, తద్విఫలదశలు ని
గూఢములు, తదర్థములును గోప్యములు, వి
దగ్ధుల కనుభవైకవేద్యంబు లివియె
ఏల మాతృగర్భవిమర్శ యిపుడు సఖుడ !

కనుల నొండొరులను జూచుకొనుటకన్న,
మనసు లన్యోన్యరంజన గొనుటకన్న
గొసరి 'యేమోయి'యని పిల్చుకొనుటకన్న,
జెలుల కిలమీద నేమి కావలయు సఖుడ!

భావబంధంబుగా మణిబంధమందు
దొలుత గట్టితి వీపట్టుతోర మీవు,
విప్పెదవె యిప్పు డనుచు జూపించి, కనుల
నశ్రువులు నిండ బలుకలేదయ్యె నామె!

కనులు వాలిచి, తేటమొగంబు వంచి,
సమయ నిఃస్పృహాయైయున్న సాధ్వి నతడు,
నెమ్మి గదుర స్పృశించి, ప్రాణం దెమల్చి
పలుక నుంకించె నెద్దియొ పలుకలేక.

అంసముల జాఱు నుత్తరీయంబు నప్పు
డవల నొత్తి, గుత్తపుకడియాల కరము
సొగసు కన్నుంగవకు నడ్డముగను జేర్చి,
కొమ్మ వెన్నాత గాగ నాకొమ్మ నిలిచె.

హృదయము లగోచరములు, తన్మృదుల కఠిన
భిన్న భిన్న వికారముల్ విశదపడని
వేమి చెప్పంగ గలము వాచామగోచ
రం బయిన ప్రేమ బహిరంతర వ్యవస్థ.

నిలిచిరి కొండొకవడి ని
ట్టుల నాయిరువురును పెన్నబడుందమి, పిదపన్
చెలియ కరంబున తోరము
వెలడించె నతండు మనము వెడలింప వెతన్.

చెంత లవంగవల్లి కలచే గడ లల్లి, కుమార శాద్వలా
క్రాంతము లైన పాదులకు గట్టెడు చల్లని నీరు వాఱు కు
ల్యాంతములన్ బెరుంగు తరుణార్ద్ర తృణాంకురపాళి గిల్లి యా
కాంతుడు వింత యైన యొకకంకణమున్ రచియించె నింపుగన్

నవక మెడవోని తృణకంకణంబు కేల
నందుకొని యామెపయి నయనాంచలములు
మరలిచి, సకియ! మన ప్రేమ మధురలాంఛ
నం బిదియె సుమ్మి! యనుచు హస్తంబు దొడిగి-

ఈతృణకంకణంబు భరియింపుము నీమణిబంధమందు సం
ప్రీతిని నప్పుడప్డు వలపింపులనెయ్యము జ్ఞప్తిగొన్న బ్రా
భాతికవేళ నీ ప్రణయబాష్పకణాంజలి నింత యిచ్చి, యే
కీతిని వాడకుండ నలరింపు, మిదే తుదివాంఛ సోదరీ!

అనుచు మొగ మావలకు ద్రిప్పె, నరుణకిరణు
డాన మార్చినయట్లు, లా యమలగుణియు
వ్రేలి వలపుటుంగరమును వెడల దీసి
ప్రియసఖుని కేలను నలంకరించు చనియె:

వలపు నశియించియును ప్రేమ నిలువగలద
యేని, కలనైన గలుషము కాని స్నేహ
మృదు మధు రసానుభవ రక్తి బొదలి మనము
నీడ లట్టుల నైక్య మందెదముగాత!

అపు డదృష్టదేవత కర మల్ల సాచి
లలితముగ జల్లు నమృతాక్షతలవిధాన
వకుళ సుకుమార తరుమతల్లికల నుండి
జలజలం బూలు రాలె నాజంటమీద.

ఆమృదుశీలపాణి నకటా! విధిమై విడనోచి నట్టి యా
కోమలరాగసూత్రమునకుం బరమావధి గాన రామి, వీ
చీమయ మైన కాల్వ వయిచెన్ సఖు డాయమ సూచుచుండ, నే
మేమియొ పోకడల్ గనుచు నేగిన దెచ్చటికో యదృశ్యమై.

పట్టుతోరంబుపై నిల్చి కట్టువడిన
చూపు లంతంతకును సార్ధ్యశోభ లట్లు
వెనుదిరుగ, నొండొరుల జూచుకొనుచు వారు
నేగి రల్ల నల్లన దమయిండ్లు సేర.

కడిగిన మృగమదపాత్రిక
విడువని పరిమళముపగిది, విధినియమములన్
విడబడియును వారల పెం
పుడు మైత్రీ ప్రేమపాశములు తెగ వవ్వురా!

# నీ రా జ న ము

సుబ్బారాయకవి తృణకంకణము మొదట 1913 సంవత్సరములో రచించి ప్రకటించినాడు. ఇప్పటికి 25 సంవత్సరాలు కావడంచేత ఇది రజతోత్సవ ముద్రణము.

The Telugu School of Romantic Revival అనీ, అభినవాంధ్ర కవితా మండలి అనీ దీని ప్రథమ ప్రకటనలో ఉండడంచేత Wordsworth, Coleridge, Shelley, Keats ప్రభృతులకవితా ప్రభావంవల్ల తృణకంకణము రచిత మైన దని కొంతమంది ఆరోజులలో భ్రమ పడ్డారు.

సుబ్బారావుగారు ఆంగ్లకవితారసము ఆస్వాదించినమాట వాస్తవమే. అయినప్పటికీ ఆ కవులశక్తికి ముగ్ధులై ఈ కవివరులు దీన్ని రచించలేదు. కాళిదాసకవీంద్రుని నాటకత్రయము బహుపర్యాయములు సాకల్యముగా సమాలోచన చేసి, ఆ మీద తృణకంకణము కూర్చినారు.

ఈ కవికి పినతల్లి మీద ప్రీతి చాలా హెచ్చు. ఆమె వాక్యామృతము ఆస్వాదిస్తూ, కొన్ని సందర్భాలలో ఆమె పలుకులే పద్యాలలో సుబ్బారావుగారు చొప్పించినారు. ఆమె అనేక విషయాలు అవగాహన చేసుకొన్న విశాలహృదయ; లోకయాత్రలో క్లిష్టగ్రంథులు విప్పివేయ గలిగిన వివేకవతి. ఆమె సూక్తులు ఈకవీంద్రుని కళకు దోహదం చేసినవి.

అందుచేతనే ఈ కావ్యంలో అనురాగసమస్య అంత అమలినముగా పరిష్కృతం అయింది. దీనికి పూర్వం ఉన్న ఖండకావ్యాలలో ఇటువంటి విధానము గోచరించ లేదు.

"ఆధునిక కవిత్వము" అనేది అప్పుడే ప్రారంభ మయింది. అరోజు అలో ఈకృతివల్ల ఏదో కొత్తలోకంలోకి మార్గము ఏర్పడిన ట్ల యింది. అంతకు ముందు ఆధునిక విధానానికి త్రోవ తీసినవారు అనూరు ప్రాయులు; ఈనూర్యాలోకంవల్ల సాహిత్య సీమలో నూతనరుచి వ్యాపించి కన్నులు మిరుమిట్లు కొలిపింది; కొంతమంది కన్నులు మూతలు పడ్డవి; కొంతమంది నేత్రపటలాలు నీరయి పోయి నవి!

తరవాత కవికుమారులు కొంతమంది ఈ నూతనద్యుతిలో స్నపితులై సాహిత్యసీమలో కాంతులీనే కావ్యదీపికలు పెట్టినారు. అంతకంతకు నూతనమార్గము దీపావళీవిరాజమానమై రాజమార్గ మయింది.

"ఆధునిక కవిత్వము"నకు తృణకంకణము అదిగ్రంథ మని అస్మ దాదుల ఆశయము. ఇటువంటి కావ్యరత్నము రజతోత్సవముద్రణ ములో రాజిల్లడము రసికజనులకు నేత్రోత్సవదాయకము!

తల్లావజ్ఝల శివ శంకర శాస్త్రి

సాహితీ సమితి
జూలై, ౧౯౩౭